# అథ ఏకాదశోఽధ్యాయః

# అన్నదాన మాహాత్మ్యము

వ్యాస ఉవాచ|

కృతపాపా నరా యాంతి దుఃఖేన మహతాన్వితాః | యమమార్గే సుఖం యైశ్చ తాన్ధర్మాన్ వద మే ప్రభో || 1

వ్యాసుడు ఇట్లు పలికెను-

ఓ ప్రభూ! పాపములను చేసిన మానవులు మహాదుఃఖమును అనుభవిస్తూ యముని మార్గములో పయనించెదరు. ఏ ధర్మములను చేసినచో సుఖము లభించునో, వాటిని నాకు చెప్పుము (1).

సనత్కుమార ఉవాచ|

అవశ్యం హి కృతం కర్మ భోక్తవ్యమవిచారతః | శుభాశుభమథో వక్ష్యే తాన్ ధర్మాన్ సుఖదాయకాన్ || 2

అత్ర యే శుభకర్మాణస్సౌమ్యచిత్తా దయాన్వితాః | సుఖేన తే నరా యాంతి యమమార్గం భయావహమ్ || 3

యః ప్రదద్యాద్ద్విజేంద్రాణాముపానత్కాష్ఠపాదుకే | స నరోఽశ్వేన మహతా సుఖం యాతి యమాలయమ్ || 4

ఛత్రదానేన గచ్ఛంతి యథా ఛత్రేణ దేహినః | శిబికాయాః ప్రదానేన తద్రథేన సుఖం వ్రజేత్ || 5

శయ్యాసనప్రదానేన సుఖం యాతి సువిశ్రమమ్ | ఆరామచ్ఛాయాకర్తారో మార్గే వా వృక్షరోపకాః |

వ్రజంతి యమలోకం చ ఆతపేఽతి గతక్లమాః || 6

యాంతి పుష్పకయానేన పుష్పారామకరా నరాః | దేవాయతనకర్తారః క్రీడంతి చ గృహోదరే || 7

కర్తారశ్చ తథా యే చ యతీనామాశ్రమస్య చ | అనాథమండపానాం తు క్రీడంతి చ గృహోదరే || 8

దేవాగ్నిగురువిప్రాణాం మాతాపిత్రోశ్చ పూజకాః | పూజ్యమానా నరా యాంతి కాముకేన యథాసుఖమ్ || 9

ద్యోతయంతో దిశస్సర్వా యాంతి దీపప్రదాయినః | ప్రతిశ్రయప్రదానేన సుఖం యాంతి నిరామయాః || 10

విశ్రామ్యమాణా గచ్ఛంతి గురుశుశ్రూషకా నరాః | ఆతోద్యవిప్రదాతారస్సుఖం యాంతి స్వకే గృహే || 11

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

మానవుడు తాను చేసిన మంచి-చెడు కర్మల ఫలమును ఆలోచించకుండగా అనుభవించుట తప్పదు. ఇప్పుడు నేను సుఖములనిచ్చే ధర్మములను చెప్పెదను (2). ఈ లోకములో ఏ మానవులైతే సౌమ్యమైన మనస్సు గలవారై దయతో నిండిన వారై శుభకర్మలను చేయుదురో, వారు భయమును గొల్పు యమమార్గమునందు సుఖముగా పయనించెదరు (3). ఏ మానవుడైతే బ్రాహ్మణశ్రేష్ఠులకు చర్మముతో గాని, కర్రతో గాని చేసిన పాదరక్షలను ఇచ్చునో, ఆతడు యమస్థానమునకు గొప్ప గుర్రముపై సుఖముగా వెళ్లును (4). గొడుగును ఇచ్చు మానవులు గొడుగుతో, పల్లకీని ఇచ్చువారు యముని రథముపై సుఖముగా వెళ్లెదరు (5). మంచమును, కుర్చీని ఇచ్చినవారు మధ్యలో విశ్రమిస్తూ సుఖముగా వెళ్లెదరు. సత్రములను, నీడను ఇచ్చు స్థానములను కట్టించువారు, మార్గములో చెట్లను నాటువారు ఎండలోనైననూ క్లేశము లేశ##మైననూ లేకుండగా యమలోకమునకు వెళ్లెదరు (6). పూదోటలను కట్టించు మానవులు పుష్పకవిమానముపై వెళ్లెదరు. దేవాలయములను, యతులకు ఆశ్రమములను, అనాథులకు నివాసగృహములను కట్టించిన మానవులు మార్గమధ్యములో గృహముల లోపల క్రీడించెదరు (7, 8). దేవతలను, అగ్నిని, గురువును, బ్రాహ్మణులను, తల్లిదండ్రులను పూజించు మానవులు సుఖముగా స్వేచ్ఛగా

పూజింపబడుచున్నవారై వెళ్లెదరు (9). దీపదానమును చేయువారు దిక్కులను అన్నింటినీ ప్రకాశింప జేయుచున్నవారై, సత్రములను ఆశ్రమములను కట్టించి ఇచ్చువారు సుఖముగా ఆటంకములు లేనివారై వెళ్లెదరు (10). గురువును శుశ్రూష చేయు మానవులు విశ్రమిస్తూ వెళ్లెదరు. బ్రాహ్మణులకు సంగీతసాధనములను ఇచ్చువారు స్వగృహమునకు వలె సుఖముగా వెళ్లెదరు (11).

సర్వకామసమృద్ధేన యథా గచ్ఛంతి గోప్రదాః | అత్ర దత్తాన్నపానాని తాన్యాప్నోతి నరః పథి || 12

పాదశౌచప్రదానేన సజలేన పథా వ్రజేత్ | పాదాభ్యంగం చ యః కుర్యాదశ్వపృష్ఠేన గచ్ఛతి || 13

పాదశౌచం తథాభ్యంగం దీపమన్నం ప్రతిశ్రయమ్ | యో దదాతి సదా వ్యాస నోపసర్పతి తం యమః || 14

హేమరత్నప్రదానేన యాతి దుర్గాణి నిస్తరన్ | రౌప్యానడుత్ప్రదానేన యమలోకం సుఖేన సః || 15

ఇత్యేవమాదిభిర్దానైస్సుఖం యాంతి యమాలయమ్ | స్వర్గే తు వివిధాన్ భోగాన్ ప్రాప్నువంతి సదా నరాః || 16

సర్వేషామేవ దానానామన్నదానం పరం స్మృతమ్ | సద్యః ప్రీతికరం హృద్యం బలబుద్ధివివర్ధనమ్ || 17

నాన్నదానసమం దాన విద్యతే మునిసత్తమ | అన్నాద్భవంతి భూతాని తదభావే మ్రియంతి చ || 18

రక్తం మాంసం వసా శుక్రం క్రమాదన్నాత్ప్ర వర్ధతే | శుక్రాద్భవంతి భూతాని తస్మాదన్నమయం జగత్ || 19

హేమరత్నాశ్వనాగేంద్రై ర్నారీస్రక్ చందనాదిభిః | సమస్తైరపి సంప్రాప్తైర్న రమంతి బుభుక్షితాః || 20

గర్భస్థా జాయమానాశ్చ బాలవృద్ధాశ్చ మధ్యమాః | ఆహారమభికాంక్షంతే దేవదానవరాక్షసాః || 21

గోదానము చేయువారు సకలకామనలతో నిండియున్న మార్గము గుండా వెళ్లెదరు. మానవులు ఈ లోకములో దానము చేసిన అన్నపానములను అచట మార్గములో పొందెదరు (12). కాళ్లను కడుగుకొనే జలమును ఇచ్చిన వారు నీటితో నిండిన మార్గములో వెళ్లెదరు. పాదములకు మర్దనా చేయుటకై నూనెను ఇచ్చువారు గుర్రముపై స్వారీ చేయుచూ వెళ్లెదరు (13). ఓ వ్యాసా! ఎవడైతే కాళ్లను కడిగే నీటిని, వంటికి మర్దనా చేసుకొనుటకై నూనెను, దీపమును, అన్నమును, నివాసగృహములను ఇచ్చునో, వాని సమీపమునకు యముడు వెళ్లడు (14). బంగారమును, రత్నములను దానము చేయువాడు మార్గములోని ఆటంకములను దాటుకొని వెళ్లును. వెండిని, ఎద్దును, మాలను దానము చేయువాడు యమలోకమునకు సుఖముగా వెళ్లును (15). మానవులు ఈ విధమైన దానములను చేసి యమలోకమునకు సుఖముగా వెళ్లెదరు. వారు నిత్యము స్వర్గములోని వివిధభోగములను పొందెదరు (16). దానములన్నింటిలో అన్నదానము గొప్పది అని మహర్షులచే చెప్పబడినది. అన్నదానము వెనువెంటనే ప్రీతిని, ఉల్లాసమును కలిగించి, బలమును బుద్ధిని వర్ధిల్లజేయును (17). ఓ మహర్షీ! అన్నదానముతో సమానమైన దానము లేదు. ప్రాణులు అన్నమునుండి పుట్టుచున్నవి. అన్నము లేనిచో, ప్రాణులు మరణించును (18). రక్తము, మాంసము, క్రొవ్వు, మరియు శుక్రము క్రమముగా అన్నము వలన వృద్ధిని జెందును. శుక్రమునుండి ప్రాణులు పుట్టుచున్నవి. కావున ఈ జగత్తు అన్నముపై ఆధారపడి యున్నది (19). ఆకలి గొన్నవారికి బంగారము, రత్నములు, గుర్రములు, గొప్ప ఏనుగులు, యువతులు, పుష్పమాలలు, గంధము మొదలగునవి సకలము లభించిననూ వారు వాటిని అనుభవించ జాలరు (20). గర్భములో నున్న శిశువులు, అప్పుడే పుట్టిన శిశువులు, పిల్లలు, పెద్దలు, మధ్యవయస్కులు, దేవతలు, దానవులు మరియు రాక్షసులు అందరు ఆహారమును కోరుచున్నారు (21).

క్షుధా నిశ్శేషరోగాణాం వ్యాధిః శ్రేష్ఠతమః స్మృతః | స
చాన్నౌషధిలేపేన నశ్యతీహ న సంశయః || 22

నాస్తి క్షుధాసమం దుఃఖం నాస్తి రోగః క్షుధాసమః | నాస్త్యరోగసమం సౌఖ్యం నాస్తి క్రోధసమో రిపుః || 23

అత ఏవ మహత్పుణ్యమన్నదానే ప్రకీర్తితమ్ | తథా క్షుధాగ్నినా తప్తా మ్రియంతే సర్వదేహినః || 24

అన్నదః ప్రాణదః ప్రోక్తః ప్రాణదశ్చాపి సర్వదః | తస్మాదన్నప్రదానేన సర్వదానఫలం లభేత్ || 25

యస్యాన్నపానపుష్టాంగః కురుతే పుణ్యసంచయమ్ | అన్నప్రదాతుస్తస్యార్ధం కర్తుశ్చార్ధం న సంశయః || 26

త్రైలోక్యే యాని రత్నాని భోగస్త్రీ వాహనాని చ | అన్నదానప్రదస్సర్వమిహాముత్ర చ తల్లభేత్ || 27

ధర్మార్థకామమోక్షాణాం దేహః పరమసాధనమ్ | తస్మాదన్నేన పానేన పాలయేద్దేహమాత్మనః || 28

అన్నమేవ ప్రశంసంతి సర్వమేవ ప్రతిష్ఠితమ్ | అన్నేన సదృశం దానం న భూతం న భవిష్యతి || 29

అన్నేన ధార్యతే సర్వం విశ్వం జగదిదం మునే | అన్నమూర్జకరం లోకే ప్రాణా హ్యన్నే ప్రతిష్ఠితాః || 30

దాతవ్యం భిక్షవే చాన్నం బ్రాహ్మణాయ మహాత్మనే | కుటుంబం పీడయిత్వాపి హ్యాత్మనో భూతిమిచ్ఛతా || 31

ఆకలి రోగములలోకెల్లా పెద్దది అని చెప్పెదరు. అన్నము అనే ఓషధియొక్క లేపముచే అది నశించుననుటలో సందేహములేదు (22). ఆకలితో సమమగు దుఃఖము, రోగము లేవు. ఆరోగ్యముతో సమమైన సౌఖ్యము లేదు. కోపముతో సమమగు శత్రువు లేడు (23). అందువలననే, అన్నదానము మహాపుణ్యప్రదమని చెప్పెదను. మరియు సర్వప్రాణులు ఆకలి అనే అగ్నిచే దహింపబడి మరణించును (24). అన్నదానము చేసినవాడు ప్రాణదానము చేసినవానితో సమానము. ప్రాణములనిచ్చుట యనగా సర్వమును ఇచ్చినట్లే. కావున అన్నమును ఇచ్చినచో,

సర్వమును ఇచ్చిన ఫలము లభించును (25). మానవుడు ఎవనిచే ఈయబడిన అన్నమును తిని బలమును పొంది పుణ్యమును చేయునో, ఆ పుణ్యములో సగము చేసిన వానికి, మిగిలిన సగము అన్నదాతకు చెందుననుటలో సందేహము లేదు (26). అన్నదానమును చేయువాడు ముల్లోకములలో ఏ శ్రేష్ఠ వస్తువులు, భోగములు, యువతులు, వాహనములు గలవో, వాటిని ఇహలోకములోనే గాక పరలోకములో కూడ పొందును (27). ధర్మార్థకామమోక్షములకు దేహము ముఖ్యసాధనము. కావున మానవుడు తన దేహమును అన్నపానములనిచ్చి రక్షించుకొన వలెను (28). అందరు అన్నమునే కొనియాడుచున్నారు. సర్వము అన్నమునందు ఆశ్రయమును కలిగియున్నది. అన్నముతో సమానమైన దానము ఇదివరకు లేదు; ఈ పైన ఉండబోదు (29). ఓ మునీ! ఈ జగత్తులో ప్రాణులన్నియు అన్నము చేతనే నిలబడి యున్నవి. లోకములో బలమును ఇచ్చునది అన్నమే. ప్రాణములు నిలబడేది అన్నముతో మాత్రమే (30). ఆత్మశ్రేయస్సును కోరు మానవుడు తన కుటుంబమును పీడించి యైననూ భిక్షువునకు, బ్రాహ్మణునకు మరియు మహాత్మునకు అన్నమునీయవలెను (31).

విదధాతి నిధిశ్రేష్ఠం యో దద్యాదన్నమర్థినే |
బ్రాహ్మణాయార్తరూపాయ పారలౌకికమాత్మనః || 32

అర్చయేద్భూతిమన్విచ్ఛన్ కాలే ద్విజముపస్థితమ్ |
శ్రాంతమధ్వని వృత్త్యర్థం గృహస్థో గృహమాగతమ్ || 33

అన్నదః పూజయేద్వ్యాస సుశీలస్తు విమత్సరః | క్రోధముత్పతితం హిత్వా దివి చేహ మహత్సుఖమ్ || 34

నాభినిందేదధిగతం న ప్రణుద్యాత్కథంచన | అపి శ్వపాకే శుని వా నాన్నదానం ప్రణశ్యతి || 35

శ్రాంతాయాదృష్టపూర్వాయ హ్యన్నమధ్వని వర్తతే | యో దద్యాదపరిక్లిష్టం స సమృద్ధిమవాప్నుయాత్ || 36

పితౄన్ దేవాంస్తథా విప్రానతిథీంశ్చ మహామునే | యో నరః ప్రీణయత్యన్నైస్తస్య పుణ్యఫలం మహత్ || 37

అన్నం పానం చ శూద్రేऽపి బ్రాహ్మణ    చ విశిష్యతే | న పృచ్ఛేద్గోత్రచరణం స్వాధ్యాయం దేశ##మేవ చ || 38

భిక్షితో బ్రాహ్మణ   నేహ దద్యాదన్నం చ యః పుమాన్ | స యాతి పరమం స్వర్గం యావదాభూతసంప్లవమ్ || 39

అన్నదస్య చ వృక్షాశ్చ సర్వకామఫలాన్వితాః | భవంతీహ యథా విప్రా హర్షయుక్తాస్త్రి విష్టవే || 40

అన్నదానేన యే లోకాస్స్వర్గే విరచితా మునే | అన్నదాతుర్మహాదివ్యాస్తాన్ శృణుష్వ మహామునే || 41

భవనాని ప్రకాశంతే దివి తేషాం మహాత్మనామ్ | నానాసంస్థానరూపాణి నానాకామాన్వితాని చ || 42

సర్వకామఫలాశ్చాపి వృక్షా భవసంస్థితాః | హేమవాప్యశ్శుభాః కూపా దీర్ఘికాశ్చైవ సర్వశః || 43

ఎవడైతే, దుఃఖితుడై నీరసించి అర్థించే బ్రాహ్మణునకు అన్నమును ఇచ్చునో, వాడు తన కొరకై పరలోకములో శ్రేష్ఠమగు నిధిని భద్రము చేసుకున్నవాడే యగును (32). తన శ్రేయస్సును కోరు గృహస్థుడు, జీవిక కొరకై పయనిస్తూ మార్గములో అలిసి సమయమునకు ఇంటికి విచ్చేసిన బ్రాహ్మణుని పూజించవలెను (33). ఓ వ్యాసా! మంచి స్వభావము గలవాడై, మాత్సర్యము లేనివాడై, పైకి ఉబుకుచున్న కోపమును విడిచిపెట్టి అన్నమును ఇచ్చి పూజించు వ్యక్తి ఇహలోకములోనే గాక స్వర్గములో కూడ గొప్ప సుఖమును పొందును (34). ఇంటికి వచ్చిన వానిని నిందించరాదు. ఏ విధముగాననైననూ తిరస్కరించరాదు. కుక్కకు గాని, వాటిని పాలించు వానికి గాని, చేసిన అన్నదానము వ్యర్థము కాదు (35). ఎవడైతే తనకు పరిచితుడు కాకపోయినా మార్గములో అలిసియున్నవానికి మనస్సులో ఇచ్చి వేయుచున్నామనే బెంగ లేకుండగా అన్నమునిచ్చునో, వాడు సమృద్ధిని పొందును (36).

ఓ మహర్షీ! ఎవడైతే పితరులను, దేవతలను, బ్రాహ్మణులను మరియు అతిథులను అన్నముచే సంతోషపెట్టునో, వానికి మహాపుణ్యము లభించును (37). అన్నపానములు శూద్రునియందు మరియు బ్రాహ్మణునియందు సమానముగా గొప్ప ఫలమునిచ్చును. ఆకలి గొన్నవానికి వంశము, చదువు, వేదశాఖ మరియు దేశము అనే వివరములను ప్రశ్నించరాదు (38). ఏవడైతే భిక్షను కోరిన బ్రాహ్మణునకు అన్నమునిచ్చునో, వాడు ప్రలయము వచ్చునంతవరకు సర్వోత్కృష్టమగు స్వర్గములో సుఖమును పొందును (39). ఏ విధముగా బ్రాహ్మణులు స్వర్గములో ఉల్లాసముగానుందురో, అదే విధముగా అన్నదాతకు వృక్షములు ఆతడు కోరే ఫలములను అన్నింటినీ ఇచ్చును (40). ఓ మహర్షీ! అన్నదాతకు ఆ అన్నదానము స్వర్గమునందు ఎటువంటి మహాదివ్యలోకములను నిర్మాణము చేయునో, ఆ వివరములను వినుము (41). స్వర్గములో ఆ మహాత్ముల భవనములు అనేకములగు రచనారూపములు గలవై అన్ని విధముల సౌఖ్యములతో ప్రకాశించును (42). ఆ భవనములను చేరియున్న ఉద్యావనములలో వృక్షములు కోరిన ఫలములను అన్నింటినీ ఇచ్చును. బంగరు నూతులు, దిగుడు బావులు, మరియు చెరువులు అన్ని విధములుగా శుభకరముగా నుండును (43).

ఘోషయంతి చ పానాని శుభాన్యథ సహస్రశః |
భక్ష్యభోజ్యమయాశ్శైలా వాసాంస్యాభరణాని చ || 44

క్షీరం స్రవంత్యస్సరితస్తథైవాజ్యస్య పర్వతాః | ప్రాసాదాః
పాండురాభాసాశ్శయ్యాశ్చ కనకోజ్జ్వలాః || 45

తానన్నదాశ్చ గచ్ఛంతి తస్మాదన్నప్రదో భ##వేత్ |
యదీచ్ఛేదాత్మనో భవ్యమిహ లోకే పరత్రచ || 46

ఏతే లోకాః పుణ్యకృతామన్నదానాం మహాప్రభాః | తస్మాదన్నం
విశేషేణ దాతవ్యం మానవైర్ధ్రువమ్ || 47

అన్నం ప్రజాపతిస్సాక్షాదన్నం విష్ణుస్స్వయం హరః |
తస్మాదన్నసమం దానం న భూతం న భవిష్యతి || 48

కృత్వాపి సుమహత్పాపం యః పశ్చాదన్నదో భ##వేత్ |
విముక్తస్సర్వపాపేభ్యస్స్వర్గలోకం స గచ్ఛతి || 49

అన్నపానాశ్వగోవస్త్రశయ్యాచ్ఛత్రాసనాని చ | ప్రేతలోకే ప్రశస్తాని దానాన్యష్టౌ విశేషతః || 50

ఏవం దానవిశేషేణ ధర్మరాజపురం నరః | యస్మాద్యాతి విమానేన తస్మాద్దానం సమాచరేత్ || 51

ఏతదాఖ్యానమనఘమన్నదానప్రభావతః | యః పఠేత్పాఠయేదన్యాన్ స సమృద్ధః ప్రజాయతే || 52

శృణుయాచ్ఛ్రావయేచ్ఛ్రాద్ధే బ్రాహ్మణాన్యో మహామునే |
అక్షయ్యమన్నదానం చ పితౄణాముపతిష్ఠతి || 53

ఇతి శ్రీశివమహాపురాణే ఉమాసంహితాయాం అన్నదానమాహాత్మ్య వర్ణనం నామ ఏకాదశో%ధ్యాయః (11)

సేవకులు వేలాది శుభకరములగు పానీయములను ప్రకటించుచుందురు. తినుబండారములు, వస్త్రములు మరియు ఆభరణములు గుట్టలు గుట్టలుగా నుండును (41). పాలు నదులై ప్రవహించును. నేయి పర్వతముల రూపములో ఉండును. భవనములు తెల్లని కాంతులతో ప్రకాశించును. శయనములు బంగారము వలె ప్రకాశించుచుండును (45). అన్నమును ఇచ్చువారు ఇట్టి లోకములను పొందెదరు. కావున ఇహపరలోకములలో తనకు శ్రేయస్సును కోరు మానవుడు అన్నదానమును చేయవలెను (46). గొప్పగా ప్రకాశించే ఈ లోకములను అన్నదానమనే పుణ్యమును చేసినవారు పొందెదరు. కావున, మానవులు తప్పనిసరిగా అన్నదానమును విరివిగా చేయవలెను (47). అన్నము సాక్షాత్తు బ్రహ్మ. అన్నము సాక్షాత్తు విష్ణువు. అన్నము స్వయముగా శివుడే. కావున, అన్నదానముతో సమానమగు దానము ఇదివరలో లేదు; ఈపైన ఉండబోదు (48). మహాపాపమును చేసినవాడైననూ తరువాత అన్నదానమును చేసినచో, సకలపాపములనుండి విముక్తిని పొంది స్వర్గలోకమును

పొందును (49). అన్నము, పానము, గుర్రము, గోవు, వస్త్రములు, శయ్య, గొడుగు మరియు ఆసనము అను ఎనిమిది వస్తువులను దానము చేయుట మరణించిన వారి లోకములో చాల ప్రశస్తముగా పరిగణించబడును (50), ఈ విధమైన ప్రశస్తదానములను చేయు మానవుడు యమనగరమునకు విమానముపై వెళ్లును. కావున, మానవుడు దానములను చేయవలెను (51). అన్నదానముయొక్క మహిమను వర్ణించే ఈ ప్రకరణమును ఎవడు పఠించునో, మరియు పఠింపజేయునో, వాడు సంపదలను పొందును (52). ఓ మహర్షీ! ఎవడైతే ఈ అఖ్యానమును శ్రాద్ధకాలములో వినునో, మరియు బ్రాహ్మణులకు వినిపించునో, వాడు చేయు ఆ అన్నదానము పితృదేవతలకు అక్షయఫలమునిచ్చును (53).

శ్రీ శివమహాపురాణములో ఉమాసంహితయందు అన్నదానమాహాత్మ్య వర్ణనము అనే పదకొండవ అధ్యాయము ముగిసినది (11).